Regd.No.
H. NL. 28
సంపుటి: 56
సంచిక: 13

# జమీన్‌రైతు

29-3-85
శుక్రవారం
16 పేజీలు
75 పైసలు.

స్థాపకులు : నెల్లూరు వెంకట్రామానాయుడుగారు
సంపాదకుడు : నెల్లూరు శ్రీరామమూర్తి

# ఉపేంద్ర-రామోజీల ప్రమాదంలో రామారావు?



మంత్రిపదవికోసం పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వరరావు పెడుతున్న పేచీని తట్టుకోలేక, ఆయనకివ్వడమా, మానడమా అనేవిషయం తేల్చుకోలేక ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు మంత్రివర్గ విస్తరణను వాయిదాచేస్తున్నట్లు తెలుస్తున్నది. డాక్టర్ వెంకటేశ్వరరావుకు మంత్రిపదవి ఇవ్వడాన్ని చిన్నల్లుడు

—కొనసాగింపు 10వ పేజీలో

## కండ్లు చెమ్మగిలచేసే కారు ప్రమాదం



21 తేది ఓజిలి సమీపంలో ట్రంకురోడ్డుమీద జరిగిన భయంకరమైన కారుప్రమాద దృశ్యం. దుర్మరణంపాలైన ఇద్దరిలో, ఏప్రెల్ 2తేది పెండ్లికొడుకు కావలసి పీనుగైన కావలి యువకుడు కాటంరెడ్డి శేషారెడ్డి మృతదేహం. (వార్త 8.వ పేజీలో)

# జమీన్‌రైతు

## ఆ ఆశా పోయింది!

పాపం, గ్రామాధికార్లకుండిన చింతపుదుక్కాం ఆశకూడా పోయింది: తమ ఉద్యోగాలను రద్దుచేస్తూ రాష్ట్రప్రభుత్వం చేసినచట్టం చెల్లదని గ్రామాధికార్లు చేసిన దావాను సుప్రీంకోర్టు త్రోసివేసింది.

శాసనసభ ఏ చట్టాన్నయినా ఏ ఉద్దేశ్యంతో చేసింది పరిశీలించే హక్కు కాని, శాసనంగాని అంశాలను శాసనసభ సమగ్రంగా పరిశీలించి చేసిందా లేదా అనేది కోర్టు విచారణపరిధిలోకి రానివిషయాలని, ఏశాసనంలో నైనా రాజ్యాంగవిరుద్ధమైన అంశాలేమైనావుంటే వాటినిగూర్చి విచారించి తీర్పుచెప్పే అధికారం మాత్రం కోర్టులకుందని ఐదుమంది న్యాయమూర్తులతో కూడిన ధర్మాసనం పేర్కొంది. అంటే గ్రామాధికార్ల రద్దు శాసనం సక్రమమేనని కోర్టు తీర్పు చెప్పిందన్నమాట.

గ్రామాధికార్లు ఇక తమ ఉద్యోగాల పునరుద్ధరణ జరగుతుందనే ఆశ వదలుకోవచ్చు. రద్దుచట్టం సక్రమమేనని తీర్పుచెప్పిన సుప్రీంకోర్టు రాష్ట్రప్రభుత్వానికి ఒకసూచనచేసింది. ఉద్యోగాలు కోల్పోయిన 38 వేల మంది గ్రామాధికార్లలో అర్హులైనవారిని గ్రామ అసిస్టెంట్లుగా నియమించవలసిందిగా సలహాయిచ్చింది. రాష్ట్రప్రభుత్వం ఈ విషయంలోనైనా ఉదారంగా వ్యవహరించటం అవసరం. ఉద్యోగాలు కోల్పోయిన గ్రామాధికార్లలో గ్రామ అసిస్టెంట్ల పోస్టులకు ఎంతమందికి అర్హత వుంటుందో చెప్పలేము. ఎందువల్లనంటే గ్రామాధికార్లుగా నియమితులైన సమయంలో ఆ ఉద్యోగాలకు నిర్దేశితమైన అర్హతలువేరు; ఇప్పుడు గ్రామ అసిస్టెంట్ల నియామకానికి అవసరమైన అర్హతలువేరు. అందువల్ల జీవనం కోల్పోయిన గ్రామాధికార్లలో చాలతక్కువమంది గ్రామ అసిస్టెంట్లుగా అర్హతకలిగివుంటారు.

అందువల్ల ఆ అర్హతలులేని ఎక్కువమంది విషయం ప్రభుత్వం సానుభూతితో ఆలోచించవలసివుంది: వారికి అర్హతలేకుంటే అర్హత వున్న వారి కుటుంబీకులలో ఒకరిని గ్రామ అసిస్టెంటుగా నియమించడం న్యాయంగా వుంటుంది. అంతమందికి ఇవ్వతగినన్ని గ్రామ అసిస్టెంట్ల పోస్టులు లేవనుకుంటే, ఇతర ఏ ఉద్యోగాలలోనైనా వారికి ప్రాధాన్యత ఇచ్చి నియమించాలి. వృద్ధులు, వికలాంగులు అయి, తెరవెంతో జీవన బాధ్యత స్వీకరిస్తున్న ప్రభుత్వం, ప్రభుత్వ సేవలో వుండి: అకస్మాత్తుగా పూటగడవకున్న వారిని నిర్లక్ష్యంచేయడం భావ్యంకాదు. ఇది 38 వేల కుటుంబాల జీవన సమస్య. బ్రిటిష్ ప్రభుత్వపు అవశేషపువర్గంగా వీరిని పరిగణించి కక్షతో వ్యవహరించడం పొరపాటు: వీరిది మానవతా సమస్యగా ప్రభుత్వం పరిగణించి, సహానుభూతిదృష్టితో వ్యవహరించడం అవసరం.

గ్రామాధికార్లను పార్ట్‌టైం ఉద్యోగులుగా పేర్కొనడం అన్యాయం! రికార్డులలో ఆ విధంగానే వుండవచ్చు: వారి నియామకం ఆ ప్రాతిపదిక మీదనే జరిగివుండవచ్చు. కాని వారిది పార్ట్‌టైం ఉద్యోగంకాదు; ఇరవై నాలుగు గంటలు గాడిదచాకిరి: వారు ఎన్ని ప్రభుత్వ శాఖలకు గ్రామస్థాయిలో బాధ్యత వహించాలి? ఎంతమంది అధికార్లకు జవాబు చెప్పాలి? ఎన్ని రికార్డులు తయారుచేయాలి? ఎన్ని ఆఫీసులకు ఎన్నిసార్లు ప్రదక్షిణంచేయాలి? ఇంతటి చాకిరీచేసే గ్రామాధికార్లను పార్ట్‌టైం ఉద్యోగులుగా లెక్కగట్టడం వాస్తవాన్ని గుర్తించడానికి విముఖులు కావడమే అవుతుంది. గ్రామాధికార్లు నిర్వర్తించవలసిన బహువిధబాధ్యతలతో, స్వల్పమైన వారివేతనాలను పోలిస్తే ప్రభుత్వం వారిచేత వెట్టిచాకిరి చేయించుకున్నదని చెప్పితీరాలి. అయితే గ్రామాధికార్లు ప్రజలపాను భూతి సౌహార్దతలను పొందడానికిబదులు, ప్రజాకంటకులనిపించుకున్నారు. ఒక్కో గ్రామాధికారి తనగ్రామంలో ఒకనియంతగా, ఒకపెద్దశక్తిగా వ్యవహరించాడు; గౌరవపాత్రంగా వ్యవహరించినవారులేరని చెప్పలేముకాని, అటువంటివారు చాలతక్కువ; ఛీ అనిపించుకున్నవారే ఎక్కువ. తెలంగాణాలో తెలుగుదేశంపార్టీ పెరగడానికి గ్రామోద్యోగుల వ్యవస్థరద్దే కారణమంటారు. తీసివేయబడినతర్వాత ఈ మంచిచెడ్డలచర్చ అనవసరం. వారిపట్ల సానుభూతితో, ఔదార్యంతో వ్యవహరించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాము.

గ్రామోద్యోగవ్యవస్థను రద్దు చేసిన ఎన్టీరామారావుగారు ఈనాటి వరకు దానికి ప్రత్యామ్నాయ ఏర్పాట్లు చేయనందువల్ల గ్రామస్థుల ఇబ్బందులకు గురికావడమేకాదు, ప్రభుత్వమూ పునాదిలేనిదైపోయింది. ఒకవిధంగా సంవత్సరంపైనుండి అస్తవ్యస్థపరిస్థితి నెలకొనివుంది. అసలు ప్రత్యామ్నాయపు ఏర్పాట్లు పూర్తిచేసి ఆ పిమ్మట రద్దుచేయవలసింది. రామారావు గారికి ప్రజల సౌకర్యంకంటే తనపంతం ముఖ్యం కాబట్టి రద్దుకే ప్రాధాన్యమిచ్చారు. ఇప్పుడైనా వెంటనే తగుఏర్పాట్లు చేయటం అవసరం.

# ప్రజల వశీకరణ విద్యలో రామారావుకు రామారావే సాటి!

రామారావుగారు గుడివాడను వదలుకొని, హిందుపురాన్ని ఎంచుకోవడం అభినందనీయం. కాని అందుకు ఆయన చెప్పిన కారణం మాత్రం బాగలేదు. "ప్రజాస్వామ్య పునరుద్ధరణ" పోరాటంలో తనకోసం ప్రాణాలర్పించినవారి జ్ఞాపకార్థం, వారి రుణంతీర్చుకోవడానికి వారి జ్ఞాపకార్థం అనంతపురంజిల్లాను ఎంచుకున్నట్లు ఆయన ప్రకటించారు. కాని అట్లాకాకుండా, తమ ప్రాంతంకాబట్టి తాను అనంతపురంజిల్లాకు ప్రాతినిధ్యం వహించాలని చెప్పుకొనివుంటే ఎంత హుందాగా వుండేది? కాని అవిధంగా చెప్పుకొనివుంటే ఆయన మాటలకు అంత ప్రచారం వచ్చివుండదు. ప్రజా వశీకరణకళలో రామారావుకు రామారావే సాటి!

లేబూరు —ఎం. సుబ్బరామరెడ్డి

### రామారావుగారి నల్గొండ ప్రాతినిధ్యం

ముఖ్యమంత్రి రామారావుగారు నామినేషన్ వేయడానికి నల్గొండకు పోయినపుడు ఆ జిల్లావాసులు తమ ప్రాంతం స్వర్గసీమ అయిపోతుందని సంబరపడిపోయారట. నల్గొండ పట్టణ మంచినీటి కొరతనుగూర్చి ప్రజలు విన్నవించుకుంటే నేను మీ ప్రతినిధినేగదా అని ముఖ్యమంత్రిగారు సమాధానం చెప్పారట. అంటే తాను నల్గొండ ఎం. ఎల్. ఏ. గా వుంటాను కాబట్టి, మంచినీళ్ళ కొరతను తీరుస్తానని చెప్పడమే గదా ముఖ్యమంత్రిగారి మాటలలోని భావం. అటువంటి రామారావుగారు చెప్పి చెయ్యకుండా నల్గొండ ఎం. ఎల్. ఏ. స్థానాన్ని వదలుకోవడంతో ప్రజలను ఎంత హతాశులను చేసి వుంటారు? వారు ఎంత ఆశాభంగానికి గురియై వుంటారో?

గుడివాడ నియోజకవర్గంవారుకూడా రామారావుగారికి ఓటువేయడం పొరపాటని పశ్చాత్తాపపడివుంటారు. అనవసరంగా రెండు నియోజకవర్గాలలో ఉప

### జనవాణి

ఎన్నికలు కల్పించి, ప్రభుత్వానికి వ్యయాన్ని, ప్రజలకు శ్రమకల్గించిన రామారావుగారు 'ఠాంటెస్సా' కారును విసర్జించి, 'మారుతి' ఎక్కడం పొదుపుకోసమేనని నమ్మాలా? ప్రజలసేరుతో ఏ సమయంలో ఏ వేషం వేయడానికి, ఏరోటివద్ద ఆపాటపాడడానికి రామారావుగారికేసరి!

నెల్లూరు —"తెలుగునాడు"

### ముఖ్యమంత్రి ఉగాది సందేశం

ముఖ్యమంత్రి రామారావుగారికి నిద్రలోకూడా నాదెండ్ల భాస్కరరావే కలవరపెడుతున్నట్లున్నారు. లేకుంటే ఉగాది సందేశంలో సైతం పిరాయింపుదార్ల ప్రసక్తి ఎందుకు? అసందర్భము, అనౌచిత్యముకాదా? అసలు ఆయనది ఎప్పుడూ ప్రసంగంకాదు వుండదు: దైరాగులం అప్పగింతగా వుంటుంది. మొన్న ఉగాదిరోజు నిద్ర లేవంగానే రేడియోలో ఆయన ప్రసంగం విన్నప్పుడు నాలో ఆనాడు కొత్త సంవత్సరపు శాపమే పోయిందనుకొంది.

నెల్లూరు —సుధాకర్

### టపుల బస్సులు-స్త్రీల సీట్లు

నెల్లూరు టవున్‌బస్సుల్లో స్త్రీల సౌకర్యార్థం కలెక్టరుగారు సదుద్దేశ్యంతో వారికి ముందుసీట్లు ఏర్పాటుచేయించారు. కాని ఆ ఏర్పాటు అనేక అనర్థాలకు, ప్రమాదాలకు దారితీస్తున్నది.

డ్రైవరుకు వెనకవక్కన స్త్రీలు కూర్చుంటున్నారు, దానివల్ల కొందరు డ్రైవర్ల చూపు వారిమీదనే వుంటున్నది గాని, డ్రైవింగ్‌మీద, రోడ్డుమీద వుండడంలేదు. స్త్రీలను ఆకర్షించడానికి వారు అనేకఫోజులు వేస్తున్నారు. అతివేగంగా నడపడం, స్టీరింగువదలి నిర్లక్ష్యంగా తోలడం, వెనుకకుచూస్తూ ముందుకు పోవడం ఈ విధంగా అనేకవేషాలు ఇవి ప్రమాదాలకు దారితీస్తున్నది: స్త్రీలకు జుగుప్సాకరంగా వుంటున్నది.

ఆడేకాక మగవారిని దాటుకొని ఆడవారు ముందు సీట్లలోకి పోవడం అసౌకర్యంగాకూడా వుంటున్నది. అందువల్ల మునుపటివలెనే స్త్రీలకు వెనుకసీట్లే కేటాయించడం అన్నివిధాల మంచిది.

నెల్లూరు —వి. రవీంద్ర

# మొలగొలుకుకు కాలం తీరుతున్నదా?

మొలగొలుకు ఎప్పుడు పుట్టిందో, ఎక్కడ పుట్టిందో, ఎవరు తెచ్చారో ఆ వివరాలు తెలిసిన రైతు లెవరైనావుంటే వ్రాయగలిగితే సంతోషిస్తాము.

ఏమైనా వరి నాటువేతలంపద్ధతి ఎప్పుడు ప్రవేశ పెట్టబడిందో మొలగొలుకు అప్పుడేవచ్చి వుంటుందని మా వూహ. నాటువేతలు పెన్నకు ఆనకట్టలు కట్టి నప్పుడే ప్రారంభమైవుండాలి. అంటే వందసంవత్సరాలు దాటి వుండా లన్న మాట. ఎక్కడనుంచి వచ్చింది అంటే అధికారికంగా తెలియదు. నెల్లూరు రైస్ రిసెర్చిస్టేషన్ అధిపతి శ్రీ వెంకటేశ్వర రెడ్డిగారు మొలగొలుకు గోదావరి జిల్లా నుండి నెల్లూరుకు దిగుమతి అయింది అని అంటారు. వుండవచ్చు. ఎందువల్ల నంటే, నెల్లూరు, కోవూరు డెల్టాలో నాటువేతం పద్ధతి ప్రారంభమైనపుడు మన జిల్లాలో వ్యవసాయకూలీలు దొరకనందువల్ల, ప్రారంభదినాల్లో కృష్ణాజిల్లానుండి కూలీలను తెచ్చి నాటు వేతలు సాగించేవారని రైతుపెద్దలు చెప్తుండేవారు. దాన్ని బట్టి వేతంపద్ధతి ప్రవేశం ధృవపడుతుంది కాని, మొలగొలుకు గోదావరినుండి దిగుమతి అయిందనే దానికి దాఖలా ఎక్కడ? అది తేలవలసివుంది.

మరొక అనుమానం మొలగొలుకు గోదావరినుండే దిగుమతి అయివుంటే శ్రేష్ఠమైన ఆ రకం ఆ జిల్లాల్లో ఎక్కడా లేకుండా ఎందుకుపోయింది? మొలగొలుకు ప్రసిద్ధికెక్కబట్టే సింహపురికి నెల్లూరనే పేరువచ్చిందంటారు. 'నెల్ల' అనేది తమిళపదం. దాన్నిబట్టి మొలగొలుకు తమిళనాడునుండి దిగుమతి అయిందను కోవాల్నా? వరికి కావేరిడెల్టా ప్రసిద్ధి. ప్రసిద్ధమైన మొలగొలుకు పుట్టినిల్లు తమిళనాడు అయితే, అక్కడ వ్యాపించకుండా నెల్లూరుకు ఎందుకువచ్చింది? పరిశోధకులు చేపట్టదగిన ఆసక్తికరమైన అంశం ఇది.

ఎక్కడపుట్టిందో ఏమోగాని, మొలగొలుకు పుట్టినిల్లు నెల్లూరనేది అందరూ అనుకునేమాట. మొలగొలుకుకు నెల్లూరు ప్రసిద్ధంకావడానికి ఒక కారణంవుందంటారు. నెల్లూరుజిల్లాలో పండే మొలగొలుకుక్వాలిటీ, ఇదే విత్తనాలు తీసుకపోయి ఇతరజిల్లాలలో వేసినా రాదంటారు. నెల్లూరు మొలగొలుకు శ్రేష్ఠతకు నెల్లూరు భూములు, పెన్నపీరు కారణమని కొందరి అభిప్రాయం. ఈవాదంలో ఎంతవరకు నిజంవుందో అనుభవజ్ఞులైన వ్యవసాయశాస్త్రజ్ఞులు చెప్పాలి. వాస్తవాలు ఏమైనా, మొలగొలుకు నెల్లూరు స్వంతం అయిపోయింది. నెల్లూరంటే ఎవరికైనా మొదటగా గుర్తుకొచ్చేది మొలగొలుకే.

మొలగొలుకంటే మద్రాసీయులు చెవి కోసుకుంటారు. కర్ణాటక వంటి ఇతర రాష్ట్రాలలో కూడా మొలగొలుకుకు గిరాకీ ఎక్కువ. ఒక్కమాటలో చెప్పాలంటే వరిరకాల్లో మొలగొలుకు రాణివంటిది. అన్నం రుచిగావుంటుంది; అన్నం నిల్వ చేసుకోడానికి అనుకూలంకావడమే మొలగొలుకు ప్రత్యేకతలు. వరిలో నవ ప్రయోగాల్లో మొలగొలుకుకు ఇంత పేరున్నా, ప్రభుత్వప్రమాణాలలోమాత్రం అది ముతకరకం; ప్రభుత్వానికి పొడవు, లావే ముఖ్యం. మొలగొలుకుగింజపొట్టి; కాస్తలావు. వంటకుబాగుండని ఐ. ఆర్ 20 వంటి కొత్తకొత్త రకాలు ప్రభుత్వ దృష్టిలో నాజూకు, అతి నాజూకు రకాలు. ప్రజలకు మొలగొలుకు ప్రియమైనది; ప్రభుత్వానికి ప్రజలు ఇష్టపడని రకాలన్నీ [illegible]. మొలగొలుకు కంటే, ఐ. ఆర్. 20 కే ప్రభుత్వధర ఎక్కువంటే ప్రజల ప్రమాణాలకు ప్రభుత్వ ప్రమాణాలకు మధ్య ఎంత అంతరమో తెలిసికోవచ్చు. ప్రభుత్వం చేతిలో నెల్లూరీయులకేకాదు, ఇతర ప్రాంతాల వారికికూడా విలువైన మొలగొలుకు న్యూనతకు గురియైంది; ప్రోత్సాహానికి పాత్రంకాలేకపోయింది.

> కొత్తగావస్తున్న రకాల పోటీకి మొలగొలుకు తట్టుకోలేకున్నది
>
> మద్రాసువంటి ఇతరరాష్ట్రాల గిరాకీ పోయింది
>
> తరచుజరుగుతున్న సంకరాలతో సహజ స్వభావం కోల్పోతున్నది

మసూరివంటి కొన్ని రకాలుకూడా మొలగొలుకు ప్రాధాన్యతను దెబ్బతీసి వేశాయి. మద్రాసు బియ్యం మార్కెట్టును ఒకప్పుడు ఆక్రమించివుండిన మొలగొలుకు స్థానంలో మసూరివంటి ఇతర రకాలు స్థానం చేసుకున్నాయి. మనజిల్లా నుండి మద్రాసుకు విధింపబడిన రవాణా నిర్బంధాలు మొలగొలుకు మార్కెట్టును దెబ్బతీయగా, ఆ రాష్ట్రంలోనేకాదు, ప్రక్కనున్న ఇతరరాష్ట్రాలలో కూడా ఇటీవల పుష్కలంగా ధాన్యంపండడం మొలగొలుకు గిరాకీని క్షీణింపజేసింది. ఇతర చోట్ల మొలగొలుకు ఈ విధంగా మార్కెట్టు కోల్పోతే, ఉత్పత్తి స్థానమైన నెల్లూరుజిల్లాలో ఇదివరకు మొలగొలుకుతప్ప ఇతర ఏ రకమూ తినని వ్యవసాయకూలీలు సైతం, కిలో రెండు రూపాయలకు వస్తున్నందువల్ల వారికి మొలగొలుకంటే పట్టింపు పోయింది. ఏ బియ్యమైనా ఒకటేననే ధోరణికివచ్చారు. దీనివల్ల మనజిల్లాలో కూడా మొలగొలుకు గిరాకీ తగ్గిపోయింది. రైతులు, మధ్యతరగతి అంతకుమించిన స్థాయి ప్రజలు మాత్రం మొలగొలుకు బియ్యం వాడుతున్నారు. కాని ఉత్పత్తితో పోలిస్తే వారి వాడకం ఏపాటి? అందువల్లనే మొలగొలుకు ధర హీనమైపోయింది. ఒక సంవత్సరం నిల్వచేసిన పాతధాన్యం, ఈ సంవత్సరపు కొత్త ధాన్యంధర ఒకటిగానే వున్నదంటే; మొలగొలుకుకంటే మార్కెట్లో ఐ. ఆర్. 20 ధరఎక్కువ పోతున్నదంటే, మొలగొలుకుధర, ఐ. ఆర్. 20, ఐ. ఆర్. 60, 2508, 12888 ([illegible]), 1444 రకాలధరలు దాదాపు సమానంగా వున్నాయంటే రైతు మొలగొలుకే ఎందుకు సాగుచేయాలి? [illegible] ఆ రకాన్నే ఎందుకు పండించాలి? [illegible] తక్కువకాలం పైర్లను పెట్టుకోవటం లాభదాయకంకాదా?

ఇటువంటి ఆలోచన ప్రతిరైతుకోనూ కలుగుతున్నది. ఇదేకాదు: అసలు వరికి వీడ్కోలు చెప్పి, లాభదాయకమైన ఇతరవాణిజ్యపైర్లను ఎందుకు సాగుచేసుకోకూడదు అనే ఆలోచనకూడా రైతుల్లో కలుగుతున్నది. అంతేకాదు; అసలు పైర్లు మానేసి టెంకాయ, యూకలిప్టస్, సుబాబుల్‌వంటి చెట్లను పెంచుకోవడం అన్నివిధాల సుఖమూ, లాభదాయకమూ కాదా అనే ఆలోచనకూడా కలుగుతున్నది. వీటినవరిస్తుంది. టెంకాయ చెట్లను శ్రద్ధగా, శాస్త్రీయంగా పెంచుకో గలిగితే ఎకరాకు సంవత్సరానికి కనీసం పదివేలరూపాయల ఆదాయం వుంటుంది. వ్యవసాయకార్మికుల కొరత, కూలిరేట్లు, ఇతర పైర్లు లాభదాయకం

—కొరవ 11వ పేజీలో



**BUMPER REDUCTION**

# Rs. 1,100

ENJOY COLOURFUL COLOURS THROUGH

# Dyanora Colour T V

Black & White, Portable Sets are also available from ready Stocks.

AUTHORISED DEALERS :

## RAMAKRISHNA ELETRONICS

Trunk Road (phone : 3919) Nellore

---

AFTER SALES SERVICE GUARANTEED.

---

We are Proud to Announce
We Stood State First
In Polar Fan Sales

**POLAR**

**7** *YEARS GUARANTEE*





**NO PROBLEM ANYWHERE WITH POLAR FANS**

They are designed to maintain a steady breeze, under demanding conditions, for long operating hours. Each fan carries a 7 year guarantee



AUTHORISED DEALERS :

# Ramakrishna Electronics

TRUNK ROAD - NELLORE - 524 001

PHONE : 3919

# కావలి తెలుగుదేశం అభ్యర్థి ఎవరు?

కావలి ఎన్నిక ఏప్రెల్ 24 తేదీన ప్రకటితమైందికాని, తెలుగుదేశం పెళ్లికొడుకెవరైంది ఈరోజు (28 తేది) వరకు తేలినట్లులేదు; నామినేషన్లకు ఆఖరుతేది ఏప్రెల్ 1. కావలి తెలుగుదేశంనాయకులు కొండవనాయుడు, సుబ్బానాయుడు, డాక్టర్ ప్రభాకర నాయుడు, రామానాయుడు సన్మానం చేయబడి హైదరాబాదుపోయి వున్నారట. వెంకటనారాయణ మాత్రం కావలిలోనే వున్నారు.

నిన్నటివరకు తానే అభ్యర్థినని వెంకటనారాయణ తీవ్రంగా ప్రచారంలో నిమగ్నులైవుండినారట; అకస్మాత్తుగా ఏ కొత్త పరిణామం సంభవించిందోకాని, రంగం హైదరాబాదుకు మారింది. గత పర్యాయం అభ్యర్థిత్వానికి ప్రయత్నించిన గొట్టిపాటి కొండవనాయుడు డాక్టర్ ప్రభాకర నాయుడు ఈసారి పట్టుదలతో ప్రయత్నం చేస్తున్నారట. ఆ ఒత్తిడికి తట్టుకోలేక తెలుగుదేశం హైకమాండు ఏదైనా సామరస్య పరిష్కారానికి అందరినీ అక్కడకు పిలిపించి వుండాలి. ఎన్నిక నాటిదా నియబడినప్పటినుండి ఆ ఇద్దరి ప్రయత్నం వున్నట్లేవుంది. కాని రామారావుగారు వెంకటనారాయణను ప్రచారం చేసుకోమన్నారని, ఉపేంద్ర అభ్యర్థిత్వంలో మార్పు వుంటదని ఖచ్చితంగా చెప్పారని తెలిసింది. ఆ ధైర్యంతోనే వెంకటనారాయణ ప్రచారానికి దిగివుంటారు.

తగిన అభ్యర్థి నిర్ణయంకోసం ఎం.ఎల్.సి. గంగాధరంగారు కావలికి వచ్చి ఉండేట్లు. అయినప్పటికి అందరినీ కలసి కాని సంప్రదించకపోయినట్లు ఒక దిన పత్రికలో వార్తవచ్చింది; గంగాధరం కావలికి రాలేదట. నాయకులు హైదరాబాదుకమ్మని ఎవరూ పిలవలేదని, తమంతటతామే పోయ్యారని తెలుస్తున్నది. ఇందులో కొండవనాయుడుగారు విజయవాడకుపోయి, హోం మంత్రి వసంత నాగేశ్వరరావుతో మాట్లాడి హైదరాబాదుకు పోయారట. అంటే కొండవనాయుడు గారు నాగేశ్వరరావుద్వారా ప్రయత్నించుకుంటున్నారనుకోవచ్చునేమో? డాక్టర్

## ఎలక్షన్ ఇంకా వేడెక్క లేదు

ప్రభాకరనాయుడు ప్రయత్నంకూడా లేకపోలేదంటారు. సుబ్బానాయుడు, రామానాయుడు, డాక్టరు, కొండవనాయుడు అభ్యర్థిత్వానికి వ్యతిరేకులని, వారు నారాయణను సమర్థించేవారని అంటారు, నారాయణ నమ్మకంకూడా అదే. అభ్యర్థి మార్పు వుంటుందా, వెంకటనారాయణే నాయకుడౌతారా అనేది ఎవ్వరూ చెప్పలేకున్నారు. కాని చివరలో వెంకటనారాయణ అభ్యర్థిత్వమే ఖాయం కావచ్చునని తెలుగుదేశం వర్గాల నమ్మకం. నామినేషన్లు వేయడానికి మార్చి 31, ఏప్రెల్ 1 తేదులు మాత్రం మిగిలివున్నాయి. పాత అభ్యర్థులుకూడా తిరిగా నామినేషన్లు

—కావలి 8(వ) పేజీలో

# పెండ్లికొడుకు కావలసినవాడు పీనుగైనాడు!

మార్చి 16 తేది కావలిలో వివాహ నిశ్చితార్థం జరిగింది. పేరుకు అది నిశ్చితార్థమేకాని, పెండ్లికంటే వైభవంగా, ఆడంబరంగా జరిగిందట. ఏప్రెల్ 2 తేది ఆ యువకుడ్ని కళ్యాణ మంటపం వేదికమీద కళకళలాడే పెండ్లి

## ఓజిలి ప్రమాదం హృదయవిదారకం!

కొడుకుగా చూడవలసింది; కాని విధి నిర్ణయం అందుకు భిన్నమైంది. 21 తేదిరాత్రి ఓజిలి సమీపంలో జరిగిన కారుప్రమాదంలో పెండ్లికొడుకుగా ఆనందవాతావరణంలో చూడవలసిన ఆ యువకుడ్ని విషాదచ్ఛాయల్లో శవరూపంలో కళ్ళు చెమ్మగిల చూడవలసివచ్చింది. అతనొక్కడేకాదు, మరొక యువకుడు కూడా జీవించివున్నప్పుడేకాదు; చావులో సైతం స్నేహితుడుగా అతనికి తోడు కావలసివచ్చింది.

ఆ యువకునిపేరు కోటంరెడ్డి శేషారెడ్డి; వయస్సుపాతికేళ్లు; తండ్రి యానాది రెడ్డి; స్వస్థానం కావలితాలూకా పర్వాయపాలెం; పదిపదిహేనేళ్ళనుండి తిరుపతిలో తండ్రి కాంట్రాక్టరుగా. శేషారెడ్డి సినిమా డిస్ట్రిబ్యూటరుగా స్థిరపడ్డాడు. అతనితోటి మృత్యువును కౌగిలించుకున్న మరొక పాతికేళ్ళ యువకుడు దామోదర్; అతనిదీ తిరుపతే; కారులో ప్రయాణిస్తుండిన మరో ఇద్దరు వ్యాయామ వస్తాదులైన యువకులు స్వల్పగాయాలతో బయటపడ్డారు.

శేషారెడ్డి పెదతండ్రి కుమార్తెకు ఏప్రెల్ 2 తేది వివాహమైందట; ఉగాదినాడు ఆ అమ్మాయిని చెన్నూరులో వదలిపెట్టి; శేషారెడ్డి 21 తేది రాత్రి 10 గంటలకు గూడూరునుండి కారులో తిరుపతికి బయలుదేరాడట తానే డ్రైవ్ చేస్తున్నాడు; ముందుసీట్లో తన ప్రక్కన మరో రవి అనే వ్యాయామ వస్తాదు ఒకరు; వెనుక సీట్లో కుడివైపు తనతోటి మరణించిన దామోదర్, ఎడమవైపు మరో వ్యాయామ వస్తాదు రమేష్ కూర్చున్నారట; కారు ట్రంకురోడ్డుమీద నాయుడుపేటవైపు గూడూరునుండి పదమూడు కిలోమీటర్లు పయనించింది; ఓజిలి ఒకమైలు కాలేదు వుండగా లారీ రూపంలో ఎదురుగా వస్తుండిన మృత్యువును కారు బలంగా గ్రుద్దుకున్నది; కారులో కుడివైపు డ్రైవింగ్ చేస్తుండిన శేషారెడ్డి, అదేవైపు వెనుకసీట్లో కూర్చున్న దామోదర్ చనిపోయారు; ఎడమవైపు వుండిన ఇద్దరూ నిరపాయంగా తప్పించుకున్నారు. పచ్చడి అయిపోయిన ఆ కారును చూస్తే, ఆయుమంతినప్పు, ఆ ఇద్దరు మాత్రం ఎట్లా బ్రతికారా అనిపిస్తుంది.

ఇంత ఘోరమైన ప్రమాదంజరిగి, ఇద్దరు యువకులు మరణించేదశలో మూలుగుతుంటే, ఆదారిన పచ్చపోయే వాహనంవాళ్ళు ఆపలేదట. ఆ సమ

—కావలి 8(వ) పేజీలో

# కన్నీటి నీరాజనం

• •

స్నేహం, సౌభ్రాతృత్వం
మూర్తీభవించిన యువకుడు మంచితనంతో
చిన్నతనంలోనే అసంఖ్యాక మిత్రకోటిని
సంపాదించిన సహృదయుడు, ప్రతిభాశాలి
మా అందరికీ ఆప్తుడు



## కోటంరెడ్డి శేషారెడ్డి

**21 తేది రాత్రి**

బంగారువంటి భవిష్యత్తును చేజార్చుకొని
కారు ప్రమాదం రూపంలో దాపురించిన మృత్యువుకు
నిస్సహాయంగా ఆహుతైపోయాడు
మా అందరినీ శోక సముద్రంలో ముంచివెళ్లాడు.
ఆ యువకుని అకాల మరణానికి
మా కన్నీటి నీరాజనం సమర్పిస్తూ,
ఆత్మశాంతికి భగవంతుని వేడుకుంటున్నాము.

కారెంపూడి శ్రీనివాసులురెడ్డి
కారెంపూడి అంజిరెడ్డి
వేణుంబాక సుధాకరరెడ్డి
పాముూరు శేషురెడ్డి

# ఓజిలి ప్రమాదం

(8వ పేజీ తరువాయి)

యూనిట్ మద్రాసునుండి కారులోవస్తుండిన నెల్లూరు మునిసిపల్ వైస్‌ఛైర్మన్ అనం వివేకానందరెడ్డి ఆతనితోటి ఆకారులో 'బ్లాహక్స్' శ్రీనివాసులురెడ్డి వగైరాలు వీటి గురియైన కారునుగుర్తించి, దిగి చూస్తే అదృశ్యం భయంకరంగా వుంది; శేషారెడ్డి, దామోదర్ కారులోని భాగాలమధ్య ఇరుక్కొని చిన్నగా మూలుగుతున్నారట; ఆ సమయంలో కారులో నా శాస్త్రపట్టభద్రులైన ఆ ఇద్దరూ లేరట. ఇంతలోగా గూడూరు మునిసిపల్ కౌన్సిలర్ శ్రీ గోపాలరెడ్డి కూడా జీపులో అక్కడికివచ్చి ఆగారట. ఆ ముగ్గురూకలిసి శేషారెడ్డి, దామోదర్ లను అతికష్టంమీద కారులోనుండి బయటకు లాగారట; ఈ లాగటంలో వారిగుడ్డలుకూడా రక్తంతో తడిసిపోయాయట. వారిద్దరినీ జీపులోవుంచుకొని గూడూరు ఆస్పత్రికి తీసుకొచ్చారట; హాస్పిటల్‌చేరిన ఐదునిముషాలకు శేషారెడ్డి ప్రాణాలు వదిలాడట. దామోదర్‌ను నెల్లూరుకు తీసుకపొమ్మన్నారట; అతనిని తీసుకొనివచ్చి నెల్లూరు ఆస్పత్రిలో చేర్చారు. అతను చేరిన వారంరోజులకు కుదుటపడ్డాడని చెప్పారు.

గూడూరునుండి తిరుపతికి శేషారెడ్డి తండ్రికి టెలిగ్రాం ఇవ్వగా, అతను వెంటనే వచ్చాడట; శవాన్ని పోస్టుమార్టమ్ తర్వాత 22 తేది ఉదయం 10-30 గంటలకు ఇవ్వగా, తిరుపతికి తీసుకపోయి సాయంత్రానికి అంత్యక్రియలు చేశారట. దామోదర్ తండ్రి కూడా నెల్లూరుకు వచ్చి అతని మృతదేహాన్ని తీసుకొని పోతుండగా 22 తేది సా. 6 గంటలకు కాళహస్తిలో కారు చెడిపోయిందట, రాత్రంతా అక్కడే గడిపి, 23 తేది తిరుపతి చేరి దహన సంస్కారాలు గావించారట.

ఏరితోటి కారులోవుండిన న్యాయశాస్త్ర పట్టభద్రులైన ఆ ఇద్దరూ ఆ ప్రమాదపు దృశ్యంచూచి, భయభ్రాంతులయ్యారో, లేక మరేమోకాని దాపేక్ష్మతులల్లో వున్న స్నేహితులిద్దరిని కాదనే వదిలేసి కామమాత్రం ప్రమాదం జరిగిన మరుక్షణంలోనే ఎట్లనో నాయుడుపేట చేరుకున్నారట. అక్కడ రమేష్ బంధువులున్నారట; వారితో చెప్పి వర్షమారదస్థలానికి టాక్సీ పంపారట, ఆ ఇద్దరు యువకులకు గాయాలు తగిలాయని, నాయుడుపేటలో చికిత్స పొంది అక్కడనుండి తిరుపతికి చేరుకున్నారని తెలుస్తున్నది.

ఇదీ ఆ విషాదగాథ; రాత్రిపూట ఒంగోలుకు తిరుగుప్రయాణం యమలోకానికి ప్రయాణంగా పరిణమించింది; ఎన్ని ప్రమాదాల్లో ఎందరు విలువైన ప్రాణాలు అర్పించుకుంటున్నా, ఇతరులు జాగ్రత్త పడడంలేదు;

ఆ విశ్లేషణలో వివేకానందరెడ్డి, గోపాలరెడ్డి చూపిన మానవకారుణ్యం, చేసిన సేవ అపూర్వమైనవి, అద్భుతమైనవి, గురగుర వూపిరితోవున్న ఇద్దరినీ వదలి అంతుచెప్పకుండా వెళ్ళిన ఆ ఇద్దరు తిరుపతి యువకులుచేసినపని మరుపురావడంలేదు;

— —





## కలువాయ గ్రామపంచాయితీ

## టెండరు నోటీసు

నెల్లూరుజిల్లా కలువాయ గ్రామపంచాయితీ ఏరియాలో ఈ దిగువ పనులు చేయుటకు రిజిష్టర్డ్ కంట్రాక్టరుల నుండి సీలువేసిన టెండర్లు కోరబడుచున్నవి. టెండర్లు వేయదలచినవారు తమ టెండర్లను కలువాయ గ్రామపంచాయితీ కార్యనిర్వహణాధికారి గారికి ధరావత్తు రశీదుతో ఆతవరని తేది 10-4-85 మధ్యాహ్నం 3 గంటల లోపల అందజేయవలయును. అదేదినము 4 గంటకు టెండరుదార్ల సమక్షమున టెండర్లు తెరువబడును. వివరములు ఆఫీసు పనిచేయు వేళలందు తెలుసుకొనవచ్చును.

| వ. నెం. | పని వివరము | పని విలువ | ధరావతు |
| --- | --- | --- | --- |
| 1) | పంచాయితీ ఆఫీసునుండి హరిజనవాడ ఎలిమెంటరీ స్కూలువరకు మెటలు రోడ్డువేయుట | 5000/- | 250/- |
| 2) | బస్టాండు నుండి చీమకుర్తి హజరత్తయ్య యింటివరకు మెటలురోడ్డు వేయుట | 8000/- | 400/- |
| 3) | చీమకుర్తి హజరత్తయ్య యింటి నుండి Sk. యూసఫ్ యింటివరకు మెటలు రోడ్డు వేయుట | 8000/- | 400/- |
| 4) | యూసఫ్ ఇంటినుండి - ఫరీదు ఇంటివరకు మెటలురోడ్డు వేయుట | 8000/- | 400/- |
| 5) | ఫరీదు ఇంటినుండి సోమశిల మెయిన్ రోడ్డు వరకు మెటలురోడ్డు వేయుట | 5000/- | 250/- |
| 6) | ఉర్దూ స్కూలునుండి సీతారామయ్య ఇంటి వరకు మెటలు రోడ్డు నిర్మించుట | 10,000/- | 500/- |
| 7) | సీతారామయ్య ఇంటినుండి అల్లంపాటి నారపరెడ్డి యింటి వరకు మెటలురోడ్డు నిర్మించుట | 10,000/- | 500/- |
| 8) | అల్లంపాటి నారపరెడ్డి యింటివద్ద నుండి బస్టాండు మెయిన్‌రోడ్డువరకు మెటలురోడ్డు నిర్మించుట | 5000/- | 250/- |
| 9) | కలువాయ బస్టాండువద్ద రెండు షాపింగు గదులు నిర్మించుట | 10,000/- | 500/- |
| 10) | కలువాయ కొత్త హరిజన కాలనీలో డ్రైయిను నిర్మించుట | 10,000/- | 500/- |

Note : షెడ్యూలు పొందుటకు ఆఖరు తేది 8-4-85
టెండరు డిపాజిట్టు చెల్లించు తేది 9-4-85
టెండరు దాఖలుచేయు తేది 10-4-85

పి. సుదర్శనం

## కావలి అభ్యర్థి

(8వ పేజీ తరువాయి)

దాఖలుచేసుకోవలసిందేనట.

కాంగ్రెస్‌కు అభ్యర్థిత్వపు పేచీయేమీలేదు: అప్పుడూలేదు, ఇప్పుడూలేదు, యానాదిరెడ్డికి పార్టీలో పోటీకి వచ్చినవారెవరూ లేరు గదా! తెలుగుదేశం అభ్యర్థిత్వం తేలనందువల్ల యానాదిరెడ్డి కాస్త నిరుత్సాహపడుతున్నట్లున్నారు. ప్రత్యర్థి ఎవరైంది తేలితే, యానాదిరెడ్డికి తనపరిస్థితి స్పష్టమవుతుంది. యానాదిరెడ్డి హైదరాబాదుకుపోయి కాంగ్రెస్ నాయకులందరినీ ఒకసారి కలుసుకొని వచ్చినట్లుంది. కాంగ్రెస్‌వారు ఇక్కడనుండి పుష్పహారాలతో, అక్కడనుండి విజయోత్సాహంతో తిరిగివస్తున్నట్లుగావుంది పరిస్థితి, అంటే బాధ్యత తీసుకోగలిగిన కాంగ్రెస్‌నాయకుడే అక్కడ కరువయ్యాడన్నమాట!

మొత్తానికి కావలిలో ఇంకా ఎన్నికల వేడి ప్రవేశించలేదు; ఎండలు మాత్రం దావం కల్గిస్తున్నట్లున్నది.

— —

## జిల్లావార్తలు

(3వ పేజీ తరువాయి)

శర్మ, ఎ. కల్లయ్య తదితరులుమాట్లాడారు. సంపాదకుడు శ్రీ రామచంద్రరావు వందనాలు చెప్పారు. చిన్న పత్రికల ప్రాశస్త్యం, భవితవ్యంపై ఆసక్తిదాయకమైన చర్చ జరిగింది సభలో!

## రాపూరు సాహితీసమితికి ఉగాదితో వసంతం

రాపూరులో వితర్కకళ్యాణంగా విర్వహించబడుతుండిన సాహితీసమితి ఇటీవల, విశ్రాంత ఉపాధ్యాయులు శ్రీ వి. జి. కృష్ణమూర్తి ఉగాదికి మొదలుపెట్టించినదట, ఆయన తిరిగివచ్చి ఉగాదిరోజు వసంతకళతో చేకూర్చిపెట్టారు.

సాహితీసమితి అధ్యక్షతలో ఉదయం పంచాంగశ్రవణం, సాయంత్రం చిన్న సభ జరిగాయి. వక్కంచ్ పట్టాభిరామరెడ్డి అధ్యక్షించారు. కవి, శ్రీ యస్. సుందరరామరెడ్డి, శ్రీ సుబ్రహ్మణ్యం, సాహిత్యోపన్యాసం చేశారు. శ్రీ ఎండి, ఖాజామియా సంస్థ నివేదిక చదివారు. శ్రీ అమరేశ్వర్ నాటిక ప్రదర్శన నిర్వహించారు. డాక్టర్ కృష్ణమూర్తి వందనాలు చెల్లించారు.

## 'కోటీశ్వరుడి'కి సన్మానం

పొదలకూరులో 18 తేది సాయంత్రం ఒక 'కోటీశ్వరుడి'కి సన్మానంజరిగింది. రాపూరు, పొదలకూరుతాలూకాలలో కోటి రూపాయల టీచరీదు వ్యాపారం చేసిన డెవలప్‌మెంట్ ఆఫీసర్ శ్రీ ఎస్. రామచంద్రారెడ్డిని ఎల్. ఐ. సి. అధికారులు ఘనంగా సత్కరించారు. జిల్లాలో కరువుగ్రస్త ప్రాంతాలుగా వున్నదే ఈ రెండు తాలూకాలలో ఇప్పటివరకు ఎప్పుడూ 10 లక్షలకు మించి వ్యాపారం జరగలేదట; రామచంద్రారెడ్డి మాత్రం కోటిసంఖ్యను దాటారు. నెల్లూరుబ్రాంచి మేనేజర్ శ్రీ బి. వి. రామయ్య ఈవిషయం చెబుతూ, రామచంద్రారెడ్డిగారి ప్రతిభ ప్రశంసనీయమన్నారు. తదప డివిజనల్ మేనేజర్ శ్రీ ఎల్. బాలకృష్ణన్, సేల్స్ మేనేజర్ శ్రీఎస్. శంకరరెడ్డి, అసిస్టెంట్ బ్రాంచి మేనేజర్ శ్రీ గురునాథం తదితరులు కూడా రామచంద్రారెడ్డికి పొగడ్త పూలమాలలు వేశారు.

## అలగానిపాడు సన్మానం

ఉగాది సందర్భంగా, కోవూరు తాలూకా అలగానిపాడు బాలగంగాధర తిలక్ గ్రంథాలయంలో కవి, శ్రీ వాకాటి శ్రీరాములుగుప్తను గ్రామస్తులు సన్మానించారు. విడవలూరు కాలేజి లెక్చరర్ శ్రీ టి. గోపాలకృష్ణారావు శ్రీ శేషయ్య, రామచంద్రయ్య, కరీముల్లా, తదితరులు ప్రసంగించారు. శ్రీ శంకరరెడ్డి ఈ సన్మానసభ జరిపారు.

— —

# వెంకటగిరి ఓట్లవివరం

[1985 మార్చి 5 తేది శాసన సభకు జరిగిన ఎన్నికల్లో వెంకటగిరి నియోజకవర్గానికి సంబంధించి బూత్ వారీగా ఓట్ల వివరం దిగువ ఇస్తున్నాము —సం]

| బూత్ | తె.దే. | కాం. |
|---|---|---|
| 1 తురిమెర్ల | 311 | 198 |
| 2 ,, | 336 | 176 |
| 3 గ్రిద్దలూరు | 402 | 221 |
| 4 ,, | 398 | 226 |
| 5 వనపారెడ్డిపల్లి | 287 | 68 |
| 6 ఊటుకూరు | 544 | 227 |
| 7 ,, | 493 | 231 |
| 8 లింగవముద్రం | 247 | 51 |
| 9 తిప్పిరెడ్డిపల్లి | 110 | 55 |
| 10 మొలకలపూండ్ల | 496 | 130 |
| 11 ,, | 476 | 169 |
| 12 ,, | 269 | 221 |
| 13 తూర్పుపూండ్ల | 498 | 91 |
| 14 ,, | 300 | 66 |
| 15 అనంతమడుగు | 432 | 135 |
| 16 పాలూరు | 300 | 114 |
| 17 నేమలిదేవు | 335 | 173 |
| 18 దగ్గవోలు | 266 | 145 |
| 19 ,, | 191 | 118 |
| 20 చెరికల్లు | 692 | 19 |
| 21 పీతకుమారయాద సముద్రం | 190 | 42 |
| 22 మాధవయ్యపాలెం | 171 | 304 |
| 23 రేవూరుపల్లి | 149 | 183 |
| 24 ,, | 148 | 183 |
| 25 కమ్మపల్లి | 679 | 22 |
| 26 ,, | 798 | 7 |
| 27 వెలంపల్లి | 632 | 68 |
| 28 దక్కిలి | 562 | 101 |
| 29 వంగవల్లి | 432 | 99 |
| 30 మార్లగుంట | 507 | 45 |
| 31 లింగసముద్రం | 799 | 75 |
| 32 కోనేశ్వరబల్లపల్లి | 126 | 167 |
| 33 పాతనాలపాడు | 599 | 49 |
| 34 మోపూరు | 278 | 280 |
| 35 ,, | 287 | 277 |
| 36 రత్నగుంట | 297 | 250 |
| 37 చిందలి | 549 | 100 |
| 38 అలిమిలి | 332 | 278 |
| 39 అంబలపూడి | 175 | 118 |
| 40 మన్నూరు | 336 | 207 |
| 41 పల్లిపాడు | 259 | 28 |
| 42 బాలాయపల్లి | 589 | 219 |
| 43 యాచసిరం | 344 | 150 |
| 44 దందవోలు | 502 | 171 |
| 45 వజగోడు | 209 | 636 |
| 46 అల్లూరుపాడు | 494 | 210 |
| 47 తిర్గంపాడు | 359 | 352 |
| 48 పాతవోలు | 304 | 416 |
| 49 దావంపల్లి | 287 | 343 |
| 50 వాగవోలు | 488 | 253 |
| 51 మాటుమడుగు | 287 | 299 |
| 52 శ్రీపురం | 207 | 270 |
| 53 కయ్యూరు | 314 | 256 |
| 54 వెంగమాంబాపురం | 326 | 151 |
| 55 అక్కసముద్రం | 217 | 86 |
| 56 గొట్టికాడు | 322 | 265 |
| 57 జయంపు | 445 | 201 |
| 58 ,, | 381 | 216 |
| 59 అరిమేనిపాడు | 615 | 15 |
| 60 ,, | 559 | 4 |
| 61 గుర్రంకొండ | 401 | 58 |
| 62 చింతమనుచేను | 318 | 247 |
| 63 బట్లకమపూరు | 264 | 123 |
| 64 ,, | 221 | 109 |
| 65 నగుటూరు | 230 | 111 |
| 66 పీర్లగుమపాడు | 184 | 117 |
| 67 పల్లావారిపాలెం | 441 | 81 |
| 68 జమగుంట | 387 | 154 |
| 69 సిగిరాం | 453 | 214 |
| 70 అమ్మపాలెం | 380 | 110 |
| 71 కంకనాలపాడు | 402 | 135 |
| 72 బంగారుపేట | 401 | 182 |
| 73 ,, | 444 | 175 |
| 74 ,, | 450 | 125 |
| 75 కలపాడు | 160 | 179 |
| 76 బంగారుపేట | 382 | 187 |
| 77 చిలకగుంట | 320 | 94 |
| 78 గుండ్లసముద్రం | 198 | 149 |
| 79 పాలెంకోట | 416 | 201 |
| 80 పాలకొండవత్రం | 308 | 108 |
| 81 ,, | 247 | 85 |
| 82 చెలికంపాడు | 311 | 167 |
| 83 కళ్లాగుంట | 173 | 16 |
| 84 వెంకటగిరి | 265 | 151 |
| 85 ,, | 205 | 141 |
| 86 ,, | 387 | 180 |
| 87 ,, | 419 | 128 |
| 88 ,, | 444 | 169 |
| 89 ,, | 433 | 120 |
| 90 ,, | 390 | 193 |
| 91 ,, | 450 | 139 |
| 92 ,, | 328 | 157 |
| 93 ,, | 352 | 126 |
| 94 ,, | 348 | 170 |
| 95 ,, | 296 | 56 |
| 96 ,, | 369 | 149 |
| 97 ,, | 398 | 91 |
| 98 కాంపాలెం | 212 | 231 |
| 99 ,, | 216 | 302 |
| 100 వెంకటగిరి | 510 | 93 |
| 101 అమ్మవారిపేట | 447 | 156 |
| 102 ,, | 462 | 126 |
| 103 పెరియవరం | 283 | 283 |
| 104 మసిలాలపేట | 376 | 84 |
| 105 ,, | 375 | 52 |
| 106 సిద్దాగుంట | 310 | 207 |
| 107 సిడిగల్లు | 458 | 161 |
| 108 ,, | 409 | 212 |
| 109 కాలగండ | 239 | 85 |
| 110 పెట్లూరు | 430 | 267 |
| 111 ,, | 319 | 210 |
| 112 వంజాం | 184 | 97 |
| 113 చిలమనూరు | 265 | 265 |
| 114 కోటంబేడు | 249 | 288 |
| 115 కామకూరు | 338 | 64 |
| 116 అత్తివరం | 264 | 228 |
| 117 ,, | 149 | 164 |
| 118 బైరవరం | 454 | 137 |
| 119 కుందాం | 500 | 118 |
| 120 ,, | 371 | 68 |
| 121 కతబల్లవోలు | 386 | 168 |
| 122 పున్నేపల్లి | 586 | 124 |
| 123 నెమళ్లపూడి | 226 | 233 |
| 124 మనవాలి | 306 | 204 |
| 125 తిమ్మాతికంట్రిగ | 246 | 104 |
| 126 చిగురుపాడు | 358 | 75 |
| 127 గ్రద్దగుంట | 405 | 200 |
| 128 మేనకూరు | 555 | 58 |
| 129 ,, | 448 | 46 |
| 130 ,, | 555 | 30 |
| 131 భీమవరం | 147 | 326 |
| 132 పెరిమిడి | 350 | 238 |
| 133 ,, | 263 | 198 |
| 134 వల్లిపేడు | 262 | 178 |
| 135 ,, | 175 | 142 |
| 136 యాజలూరు | 192 | 292 |
| 137 ఉప్పరపల్లి | 157 | 326 |
| 138 గుత్తికొండవారిపల్లి | 351 | 295 |
| 139 ,, | 256 | 270 |
| 140 కేశవరం | 575 | 64 |
| 141 మద్దాలి | 390 | 109 |
| 142 వెంకటరెడ్డిపల్లి | 416 | 324 |
| 143 పెదపరియ | 487 | 90 |
| 144 కునసగిరిపాలెం | 312 | 69 |
| 145 రాచపాలెం | 264 | 250 |
| 146 వండ్లూరు | 301 | 283 |
| 147 అయ్యనరెడ్డిపాలెం | 289 | 218 |
| 148 కావులూరు | 239 | 237 |
| 149 ,, | 192 | 172 |
| 150 కూడివాడ | 68 | 377 |
| 151 పల్లపేడు | 257 | 104 |
| 152 చింతమత్తూరు | 3 | 805 |
| 153 ఓబిలి | 332 | 121 |
| 154 ,, | 307 | 128 |
| 155 మానమాల | 385 | 130 |
| 156 కురుగొండ | 462 | 200 |
| 157 ,, | 421 | 182 |



# హైదరాబాదు లేఖ

(మొదటి పేజీ తరువాయి)

చంద్రబాబునాయుడు ఒకవైపు తీవ్రంగా వ్యతిరేకిస్తుండగా మరొకవైపున వెంకటేశ్వరరావుకు పదవి ఇస్తే పెద్దఎత్తున వ్యతిరేకఫలితాలు రాగలవని ఇంటలిజెన్సు శాఖకూడా ముఖ్యమంత్రిని హెచ్చరించడంతో ఆయన సందిగ్ధంలో పడిపోయాడని విశ్వసనీయ వర్గాలవారు అంటున్నారు.

అయితే వెంకటేశ్వరరావు మాత్రం మంత్రిపదవిని చేపట్టాలని ఈసారి గట్టి పట్టుదలతో వున్నట్లు తెలిసింది. తన విషయంలో మామగారు తటపటాయిస్తుండడంతో ఆయన శాసనసభ సభ్యత్వానికి రాజీనామాచేశారని మంత్రిపదవి ఇవ్వక పోతే స్పీకర్‌కు పంపాలని కోరుతూ రాజీనామాపత్రాన్ని శ్రీ రామారావుకు అందజేసి స్వగ్రామం వెళ్ళిపోయారనే వార్త రాజకీయ వర్గాలలో గుప్పుమంటున్నది. వాస్తవానికి ఇంటలిజెన్సుశాఖ ఇచ్చిన నివేదికవిషయంలో శ్రీ రామారావుకు అంత ఆందోళనగాలేదని, వెంకటేశ్వరరావుకు ఎట్టిపరిస్థితులలో మంత్రి పదవి ఇవ్వకూడదని చిన్నల్లుడు చంద్రబాబునాయుడు పట్టుపడుతున్నందువల్ల ఆయన ఎటూ తేల్చుకోలేక పోతున్నారని తెలుగుదేశం వర్గాలవారు అంటున్నారు. కాని చంద్రబాబునాయుడు వద్ద ఉన్న కొద్ది అధికారాలని ఈసారి ఇవ్వకపోతే ఊరుకునేదిలేదని వెంకటేశ్వరరావు మరింత హెచ్చరిస్తున్నట్లు వినికిడి. వెంకటేశ్వరరావుకు మంత్రి పదవిమీద విజానికి పెద్దగా ఆసక్తి లేదని, చంద్రబాబునాయుడు కాంగ్రెస్‌లోని తన మాజీమిత్రులను పార్టీలోకి తెచ్చుకొని ఒకవర్గాన్ని నిర్మించుకొని పార్టీని ప్రభుత్వాన్ని నడుపుతున్నందువల్ల ఆయన ఆటకట్టించడానికి తాను మంత్రినై ఒకవర్గాన్ని నిర్మించుకొని ధీకొనాలని భావిస్తున్నాడని వెంకటేశ్వరరావు సన్నిహితవర్గాలవారు అంటున్నారు. ముఖ్యంగా రామారావుతో 'భారతదేశం' పార్టీపెట్టించి రాష్ట్రంలో తాను గద్దె నెక్కడానికి చంద్రబాబునాయుడు పన్నాగాలు చేస్తున్నాడని వెంకటేశ్వరరావు అనుమానిస్తున్నట్లుగా చెబుతున్నారు.

ఇదిలావుండగా తెలుగుదేశంపార్టీ ప్రధానకార్యదర్శి పి. ఉపేంద్రకు ముఖ్యమంత్రి రామారావుకుమధ్య సంబంధాలు బాగా దెబ్బతిన్నట్లు తెలుస్తున్నది. ఉపేంద్రను 'గాడ్‌ఫాదర్' అనబడే ఈనాడు పత్రికాధిపతి రామోజీరావుకు, రామారావుకుమధ్య సంబంధాలు దెబ్బతినడంతో ఉపేంద్రను రామారావు అనుమానిస్తున్నట్లు వినికిడి. ఎందుకంటే ఉపేంద్ర ఎప్పటికైనా రామారావుకంటె రామోజీరావుకే విశ్వాసపాత్రుడుగా వుంటాడనేది ఎవరు కాదనలేనివత్యం. ఈ సంగతి రామారావుకు తెలుసు. రామారావు 'భారతదేశంపార్టీ' ప్రారంభించగానే రామోజీరావు ఆయన మీద ప్రత్యక్షయుద్ధం ఆరంభించబోతున్నారని తెలుస్తున్నది. రామారావుకు వ్యతిరేకంగా రాయడం ప్రారంభించేందుకు రామోజీరావు తగిన సాకుకోసం వెతుక్కుంటున్నారు.

భారతదేశం పార్టీ ప్రారంభించిన వెంటనే ప్రజలు తెలుగుదేశాన్ని ఎన్నుకొన్నది రాష్ట్ర అభివృద్ధికోసమే కాని జాతీయ రాజకీయాల్లోదూరి ప్రధాని పదవికి నిచ్చెనలు వేయడానికి కాదంటూ రామారావు వ్యతిరేక ప్రచారం ప్రారంభించడానికి రామోజీరావు సన్నాహాలు చేసుకుంటున్నారని తెలిసింది, ముఖ్యమంత్రి ఇటువంటి ప్రమాదాన్ని పసిగట్టి ఒకరికి రెండు పదవులు ఉండకూడదు అనే సూత్రం పేరుతో ఉపేంద్రను పార్టీ ప్రధాన కార్యదర్శి పదవినుంచి తొలగించి ఆ స్థానంలో చంద్రబాబునాయుడును నియమిస్తారని తెలుగుదేశం పార్టీలో గుసగుసలు బయలుదేరాయి, కాని ఇదే జరిగితే ఫలితాలు దారుణంగా ఉంటాయని రామోజీరావు ఉపేంద్ర కలిసి నాదెండ్ల భాస్కరరావు పాత్రను ఈసారి దిగ్విజయంగా నిర్వర్తిస్తారని, అంటున్నారు. ఫిరాయింపుల వ్యతిరేక బిల్లు పరిధిలోనే ఓం ప్రథమంగా తె. దే. పార్లమెంటు సభ్యులలో చీలిక తీసుకొని వచ్చి వారిని ఇందిరా కాంగ్రెస్‌లోకి పంపించే ప్రయత్నాలు జరుగుతాయని జోస్యం చెపుతున్నారు. అయితే, మంత్రివర్గ విస్తరణతోపాటు ఆ తర్వాత ముఖ్యమంత్రి వేయబోయే ఎత్తుగడను వసువరించే ఈ ఊహాగానాలకు ఒకరూపం వచ్చే అవకాశంఉంది. —హా. వి.



# శ్రద్ధాంజలి

నెల్లూరు కోడిగ్రుడ్ల వ్యాపారస్తులలో అగ్రగణ్యుడు, అందరికి తలలోనాల్కవలెవుండి మాలో ఒకడైన మంచి మిత్రుడు, విద్యాధికుడు, యువకుడు, సులోచన మెడికల్స్ ప్రొప్రయిటర్

## శ్రీ గాలి గోపాలరావు M.A.

21-3-85 తేది గురువారం అకాల మృత్యువాతబడి, మాకు దూరమైనారు. వారికి మా శ్రద్ధాంజలి ఘటిస్తూ, వారి కుటుంబానికి మా ప్రగాఢ సానుభూతిని తెలియజేస్తున్నాము.

**ఎన్. మోహన్‌రావు**
సులోచన హేచరీస్

సోదా వెంకటసుబ్బయ్య
S. V. పౌల్ట్రీ ఫారం

శ్రీనివాసా
పౌల్ట్రీ సప్లిమెంట్స్
నెల్లూరు

శ్రీరామ వెంకటసుబ్బయ్య

సిహెచ్. వేంకటనారాయణ
రాఘవేంద్ర ఫీడ్స్

బాలాజీ హేచరీస్

డా॥ పి. విజయరామిరెడ్డి
కోవూరు

ఎ. శ్రీనివాసులురెడ్డి
కోవూరు

డా॥ కె. వెంకటరామిరెడ్డి
నెల్లూరు

**బి. వి. రావ్**
ఛైర్మన్, NECC పూనా

ఎం. ఆర్. ప్రసాద్
వశిపాల్ ఎగ్ ట్రేడర్స్

విద్యాసాగర్
విజయదుర్గ ట్రేడర్స్ గుంటూరు

సదానందరావ్
మద్రాస్

ఎస్. కె. మైలసామి
ఈరోడ్

వి. కేశవయ్య
సెక్రెటరి, A P పౌల్ట్రీ ఫెడరేషన్

ఎన్. బలరామయ్య
నేతాజి నగర్

కె.వి.ఆర్. ఫార్మ్స్
నేతాజి నగర్

మెజెస్టిక్ ఫీడ్స్ ప్రై.లి.

**ఎ. మోహన్‌రెడ్డి**
మురళి ఎగ్ ట్రేడర్స్, మద్రాస్

అమృతలూరు
నారాయణరావు

ఎన్. శ్రీరాములు
సెక్రెటరి, నెల్లూరుజిల్లా పౌల్ట్రీ
ఫార్మర్స్ అసోసియేషన్

వాణీ బ్రోకర్స్

వాణీ ట్రేడర్స్

సింహపురి హేచరీస్

వి.ఎల్. ప్రసాద్,
మద్రాస్

సిహెచ్. రమణయ్య
మద్రాస్

కె.ఎల్. నారాయణరావు
లక్ష్మి ట్రేడర్స్

రాజు అండ్ కంపెనీ

**ఆర్. దేవిప్రసాద్ చౌదరి**
ఈదూరు

**ఎ. మాలకొండయ్య**

వాకాటి సుబ్బారావు

హరనాథ్ బ్రోకర్స్

తిరుపతి మెడికల్స్

జి.కె. మెడికల్స్

ఇండియన్ మెడికల్స్

కొండారెడ్డి
లక్ష్మీనారాయణ ఏజెన్సీస్

డా॥ ఎ. జయప్రసాద్‌రెడ్డి

మాలెపాటి శేషయ్య అండ్
పెనల హనుమంతరావు కం.

నంబూరు నారాయణరావు
బి.ఎల్.వి. హేచరీస్

Edited, Printed & Published by N. Sree Ramamurthy at The Zamin Ryot Press, Thipparajuvari Street, Nellore (A. P.)